

# అమ్మమ్మగారి అద్భుత యంత్రాలు


రచయిత: రాజీవ్ ఈపే

బొమ్మలు : రాజీవ్ ఈపే

తెలుగు సేత : సిద్దార్థ్ రెడ్డి





చదువుట దశ 2



"అమ్మమ్మా! అమ్మమ్మా! ఈరోజు మనం కొబ్బరి బర్ఫీ చేసుకుందామా?" సూరజ్ వాళ్ళ అమ్మమ్మను అడిగాడు.



"హ్హా హ్హా హ్హా !నువ్వు సహాయం చేస్తే సరే!

అమ్మమ్మ అంది.



" సిద్ధమా?" అరిచాడు సూరజ్.

"నేను సిద్ధం!" అంది అమ్మమ్మ.



"మనం ముదిరిన కాయలు మాత్రమే

తీసుకుందాం,సరేనా?"

బాగా ఎర్రగా ఉన్నవి... చూడు!ఇదుగో అవి!"

దబ్... దబ్ !



"ఇప్పుడు పీచు తీసేయడానికి..."

ఫట్!ఫట్...ట్!



సూరజ్ కడుపు నుండి శబ్దాలు వచ్చాయి.

అమ్మమ్మ నవ్వింది.



"ఇప్పుడు  టెంకాయను పగలుకొట్టాలి... ఇలా!"

కటక్!



"పగలుకొట్టి కాయను బా.....గా తురమాలి!"



"దాన్ని మిగితా పదార్థాలతో కలిపి పెనం మీద వేయాలి...."

"ఈ వాసన చాలా బాగుంది,అమ్మమ్మా..!"



"తరువాత దాన్ని ఒక వెడెల్పాటి

పాత్రలో పోయ్యాలి....చల్లబడే వరకు

ఆగు,బాబా!"



"ఇప్పుడు చిన్న ముక్కలుగా చేసుకోవాలి..."



"మన కొబ్బరి బర్ఫీ తినడానికి సిద్ధంగా ఉంది!"

"చాలా రుచిగా ఉంది!"

అమ్మమ్మ బర్ఫీ చెయ్యడానికి సాధారణ యంత్రాలు వాడింది!

ఇవి పనిని మరింత సులభం చేస్తాయి.

సాధారణ యంత్రాలు

ఆరు రకాలు:



1) వాలు తలము(ఇంక్లైన్డ్ ప్లేన్)



2)తులాదండం(లీవర్)



3)చక్రం మరియు ఇరుసు(వీల్ మరియు ఆక్స్ల్)



4)ముక్కోణము(వెడ్జ్)



5)కప్పి(పుల్లీ)



6)మర(స్క్రూ)

సూరజ్, అమ్మమ్మ కొబ్బరి బర్ఫీ చేసేటప్పుడు వాడిన సాధారాణ యంత్రాలను గుర్తించగలరా?

